# శివ తాండవము
## (గేయకావ్యము)



"సరస్వతీపుత్ర"
పుట్టపర్తి



అఖిల సాహిత్య గ్రంథాధివర్తక
ఆంధ్ర సంసత్ : గుంటూరు

ఆంధ్ర సంసద్గ్రంథమాల — ౧ కుసుమము



ద్వితీయ ముద్రణము 1955

మూల్యము
రూపాయి పావుల

ప్రాప్తిస్థానము:

అఖిల సాహిత్య కళాభివర్ధక

ఆంధ్ర సంసత్, గుంటూరు - 2

## తొలిపలుకు

ఈ కృతి యొకానొక గంభీర మధురభావమునం బ్రవహించిన ధార. తరువాత నీ కావ్యమునం దిక [illegible] చక్క [illegible] యత్నించితిని. బుద్ధి కందలేదు. మార్పులు చేర్పులు సరి చేయం జూచితిని. సరిపడలేదు. కడ కిది నా రచన కాదనియు, నా వేల్పు 'అగస్త్యేశ్వరుని' వరప్రసాదమనియు నిర్ణయించికొంటిని. ఈ కావ్యము గుణదోషములతో నాకుం బనిలేదు.

ఇది వ్రాసి యయిదేండ్లయినది. ఈనాటి కిది వెలుగు జూచినది. దీనికి సహాయకులు, నా మిత్రులు, రసికులు, భక్తులు వారికి కృతజ్ఞత! అన్న శివశంకరశాస్త్రికి నా నమస్కారములు. సెలవు.

పుట్టపర్తి



# అభిప్రాయము

శ్రీమాన్ నారాయణాచార్యులుగారు చెప్పిన 'శివతాండవ' కృతిని ఆకర్ణించి ఆనందపరవశుండనైనాను. ఈ కావ్యము ఆంధ్ర సరస్వతికి ఉజ్జ్వల నూతనాలంకారము. కల్పన అతిలోకము. సంగీత, సాహిత్య, నాట్యసంకేతములు సరసముగా సలక్షణముగా ఈ కృతిలో యిమిడిపోయినవి. అర్థము గంభీరము, ఆశయము అత్యుదాత్తము. నా దృష్టిలో ఆధునిక సారస్వతమున యిటువంటి గేయకృతి యింకొకటి లేదు.

ఇతి శివమ్!

తల్లావఝ్ఝుల శివశంకర శాస్త్రి

★

# ప్రకాశకీయము

'శివతాండవ' కృతి తెలుఁగు సరస్వతికి వెలలేని యలంకరణము. ప్రసిద్ధ కవి శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల రచనలన్నింటను మేలుబంతి. ఈ కృతి ప్రథమ ముద్రణ ప్రతులు నాలుగేండ్ల క్రిందటనే యయిపోయినవి. రసజ్ఞులెందరో ఈ చిన్ని రసగుళికకొఱకు తమ యభిలాషను వెలిబుచ్చిరి. కాగా ఈ పుస్తకము పునర్ముద్రితము కావలసిన యవసరమెంతేని యుండెను. మా 'ఆంధ్ర సంసత్తు' ఆ కొఱతను గుర్తించి ఈ యమూల్య రచనను తమ పుస్తకమాలయందు వెలువరించుచు నాంధ్ర సాహితీలోకమున కందించుచున్నది. ఇందులకై తమ యంగీకృతి నొసగిన సరస్వతీపుత్త్రి శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులకు మేమెంతయుఁ గృతజ్ఞులము. ఆంధ్ర సాహితీలోక మీ రచనను ఆదరించి తమ రసజ్ఞతను వెల్లడించగలదని మా విశ్వాసము.

అఖిల సాహిత్య కళాభివర్ధక
ఆంధ్ర సంసత్, గుంటూరు
ఫాల్గుణ - పూర్ణిమ - జయ
8-3-1955

వారణాసి రామమూర్తి
కార్యదర్శి



ఓం

ఆఙ్గికం భువనం యస్య
వాచికం సర్వవాఙ్మయమ్
ఆహార్యం చన్ద్రతారాది
తం నుమస్సాత్త్వికం శివమ్.



# శివతాండవము

★

ఏమానందము
భూమీతలమున!
శివతాండవమట[1]!
శివలాస్యంబట[2]!

అలలై : బంగరు
కలలై, పగడపుఁ
బులుఁగులవలె మ
బ్బులు విరిసినయవి
శివతాండవమట!
శివలాస్యంబట!

వచ్చిరదేమొ! వి
యచ్చరకాంతలు
జలదాంగనలై
విలోకించుటకు
శివలాస్యంబట!

---

(1) అంగహారములును, కరణములును ప్రధానముగాఁగలిగి యుద్ధతప్రచురా గమైనది తాండవము. [సంగీతరత్నాకరము.]

(2) సుకుమారాభినయములయమై శృంగారపోషకమైనది లాస్యము [సంగీత రత్నాకరము.]

లలితాహ్లాదము మం
జులమగు కాలము
బూవుల తావుల
తో నసివాడఁగా!

భారతీయుట పా
ర్యాప్తిణ నలంకా
రముఁదీర్చెడునది!

రమణీయస్మిత
ములఁ గావించునో
యులఁగల హ్లాదమ్ములు!

చతురాననుఁడే
సవదరించునట
శర్వాసకు త్రైమ
సర్వవిభూషలు!

వీచా విశ్లిత
కీచకములు హ్లాదు
వీ చములుగాఁ ద
ర్పితలోకమ్ములు
సహారతిములు గో
ణీ గీతా ష్టాఁషగు[1]
శిష్యునరు సేసలు
జల్లెడు మట్టై.

(1) చంద్రుఁడు

తకఝం తకఝం
తకదిరికిట నా
దమ్ములతో లో
కమ్ముల వేలుపు
నెమ్మిగ నిలఁబడి
నృత్యమాడు నెడ
లయానుగతిఁ గ
క్రమముగా శ్రుతిఁబ
ట్టుటకో! గాంధర్వులు
సవదరించు ను
త్కటభృంగమ్ములు.

ఈ సెలకన్నెల
కెవ్వరు చెప్పిరో!
యా సర్వేశ్వరు
నభినయమహిమను
గుచ్ఛాళు లల్లెడ
విచ్చలవిడిగా
ముసికిళ్ళాడఁగ
నసమునఁబొంగెడు—
ఓ హో హో హో!
యహాహాఽతీతం
బీభూమానందం
బిలాతలంబున!

సంధ్యాసతి! యీ
సంభ్రమ మేమిటె!
నవకుసుంభ రా
గవసన మేమిటె!
ఆకుంచిత తి
గ్మక్రమసారి ల
జ్జామసృణ కటా
క్షపాత మేమిటె!
విలాసవక్రిత
విచలస్స్నిగ్ధాం
బుసశ్రీమతి! నీ
వునువలెనే జిలు-
పలుకని మేఖల.
వాలక మేమిటె!
యెవ్వరికోసర
మీనాభిజ్ఞాప్వకమము!
శివప్రాణకా! హా
చెలువా! యీకథ
లెవ్వరు చెప్పిరె?
యిలాతలంబే

ఆడెడునటు నా
ప్రాణేశ్వరుఁ
డో దినమణి! నిలు
రా! దినమంతయుఁ

బహుమటి చేశాపు
వారలాకీత్తగ
నెఱిగింసుటు త్రై_
బయు గ్_త్రైదవాఁ!

అలమృగములు గ
న్నుల బాష్పమ్ములు
విడిచెదు నెందుకు!
విశ్వేశ్వరునకు
నడుగులుగడుగుట
కై పాద్యంబో!!

గుసగుసమని యీ
కిసలయములు స
మ్మదపూరముగా
మాటలాడు నెవో!!
నోమున్నది! లో
కేశ్వరునాట్యపు

ఓ హో హో హో
యహోహోఽతీతం
బీయానందం
బిలాతలంబున!!

★

# నంది నాంది

అఖర్వేందుమౌళిఖ్యల్లకేశ స్మితరుచిపటలీదంశితం [1] గౌరవర్ణం
త్రైస్రోతీయాంకం [2] విహారంతరసయన, మహితుల ప్రత్నభూపావి
తానం

నృత్తారంభాట్టహాస ప్రవిచలితకకుప్చక్ర, మానందకందం
తం వందే నీలకంఠం త్రిదశపతి శిరశ్చుంబిపాదాబ్జపీఠం.

వ్యాఖ్యానానాం స్వయంభుప్రముఖసురివచాం పురతోవర్త
మానై

శ్లోకాఽఽలోకోత్తరైస్తై రవిదితగతిభిర్విభ్రమైస్తైరతార్కైః
కుర్వంతం దేవకాంతాహృదయవలభిషున్యాస ముద్రాంస్మ
రస్య

త్రైలోక్యాఽఽనందదానప్రవణ, ముపనిషత్త్రాణ మీశం
భజామః.

పాటలజటాఘటిత జూటగతిశోభిభృశ పాటిత తమిస్రవలయం
కూటశిఖరం పటునిశాటకుల ఘాటసుఖమోటనర సైక
నిలయం

కోటిశతకోటి సమకోటి సముపోత్థిత కృపీటభవ దగ్ధమదనం
నాటితభువం ప్రళయనాటక మహారచన పాటవచణం
హృదిభజే.

మత్తగజకృత్తియుత ముత్తమమహర్షి గణ చిత్తవసకోకిల మజం
నిత్యసుఖదం, త్రిదశకృత్యఫలదం, భువనమర్త్యపరిరక్షణచణం

(1) కవచితమైన. (2) మూడవదియైన.
(3) అభినయవర్జితమై, గాత్రవిక్షేపమాత్రమే కలిగినది నృత్తము.

భావపరిముగ్ధగిరిజావనజతుల్యపదయావకరసాఽఽర్ద్రశిరసం[1]
పీవరభుజం ప్రమథజీవనమముం సకలపావనతనుం హృదిభజే.

గంగాతరంగకణసంగ విశాసిజూటం
సంధ్యాంతరిక్షమివ తారకితం[2] దధానః
నృత్యోత్సవాఽగ్ర పరికల్పిత వేదజాతః
కుర్యాద్దయాం, త్రిభువనాఽఽలయదీపవమః.

దధన్నేత్రం గౌరీప్రణయముకురం[3] మంజనవిధా
ప్రసన్న స్మేరాఽస్యం లలితలలితం చాంద్రకలికా
మహస్సంవిద్రూపం భుజగపతిభూషం శ్రుతిసతీ
వతంసం శంసామః కిమపి కిమపిబ్రహ్మసరసం.

గౌరీకటాక్ష రేఖా
చంద్రకితం[4] పక్ష్మదధానాయ
పింగళజూటాయనమో
గంగాకమనాయ, వేదవేద్యాయ.

---

(1) పార్వతీదేవిపదతామరసమునందలి లత్తుకచేరంజింపఁబడిన శిరస్సుగల వాఁడు. భరతశాస్త్రమందు "నిటాలతిలకా" అను స్థానవిశేషము గలదు. అయభినయమునందుఁ బాదముతోఁ దిలకము దిద్దినట్లు దానిని నిటలముపై నిలుపవలెను. పార్వతి యాయభినయమును జూపించుచుండగా నామె కాలు శివుని శిరస్సునకుఁ దగిలినది.

(2). నక్షత్రములచేతఁ గూడినది.

(3) శివుని నేత్రములందు నీరాజనములుగాను పార్వతి తనయులం [illegible] దిద్దికొనుటకు, నతని నేత్రమామెకు లీలాదర్పణమైనది.

(4) నెమలికన్నులవంటి కన్నులుగల

# శివ తాండవము

శాస్త్రాఆస్ఫోటయంతం కహకహనినదై ర్భీషణై రట్టహాసైః
హస్తవ్యాక్షేపభంగైః ప్రసభమపద్రుతంవ్యోమ కుర్వంత
ముచ్చైః
పాదాఽఽఘూర్ణైరధోగాం పవనగిరి గుహాకోటి ముత్కంప
యంతం
ధిం ధిం ధిం శబ్దఘోరం హ్యాదివికటమహాకాల మాలోక
యామః.

ఘటచ్ఛటసదచ్ఛిఖాపటలపోషణం భీషణం
బహిర్హుతవహం స్ఫుటన్నిటలలోచనాఽభ్యంతరాత్
ప్రమత్తిఙ్గన స్ఫులిఙ్గాలిప్రచలితాఽఖిలాంఽగస్సయ
స్నమాఽఽపతతు మానసే తుహినశైలకూటోచ్ఛ్రితః.

బధ్నన్ నృత్తాంఽతరాంతః ప్రగళితమహిపాఽఽకల్పితం
పట్టబంధం
సంబాధోద్భిన్నఘోరశ్వసిత హుతవహాఽఽదీప్తదంష్ట్రావి
టంకం
ప్రోత్తాలస్స్వైరధీరైః పథయుగలమహాఽఽస్ఫోటనైః కల్ప
యంతం
నానాభంగాన్ లయాఽఽబ్ధా భ్రుకుటితనిటలం శూలినంసంస్మ
రామః.

జయ జయ శంకర ! శత్రుభయంకర !
జయ జయ ప్రమథ పిశాచవశంకర !
జయ జయ తాండవ సంభ్రమసుందర !
జయ జయ ధైర్యవిచాలితమందర !

జయ జయ శీతలచంద్రాభరణా!
జయ జయ కరుణాశరణాచరణా!
జయ గగనాంబర! శాతత్రిశూలా!
జయ శుభంకరా! జయ మహాకాలా!

ఢంక్కారవములు బిక్కటిల్ల దశ
దిక్కుల ప్రహారుతి దీర్ఘకృతములు
ఝణుఝుణుఝుంఝణత్ స్వనములొదవను ప్రతి
నినదము రేపఁగ నసిత భుజగములు
శూలంబున నాభీలత తేవఁగఁ
నీలాచయములు తెలిహాసములు[1]
ధగధగితములై నిగుడఁగ నగవులు
గగన తలస్థులు పొగడ దేవతలు

నీ నృత్తములో నిఖిల వాఙ్మయము[2]
తానముగా మఱి గానము గాఁగను
తాండవింపఁగాఁ దరుణాంబై సది
ఖండేందుధరా! గనలుము నెమ్మది

జయ నాదలయానందితమూర్తీ!
జయ జయ తాండవ సంభృతకీర్తీ!
జయ గగనాంబర! శాతత్రిశూలా!
జయ శుభంకరా! జయ మహాకాలా!

---

(1) నవ్వులు. (2) సర్వవాఙ్మయమును బరమ శివుని తాండవాభినయము.
(అభినయదర్పణము.)

# శివ తాండవము

క॥ శ్రీరమణీ లలిత కటా
క్షారుణరోపిత చంపక ప్రసవమాలా శృం
గారిత వక్షుండు పయిగా
వీరుఁడు పరదైవ మోఁద పలికెడుఁ గాతన్.

ఉ॥ కన్నులఁ గల్వపూవులు వికస్వరము ల్లగనాంచలంబులన్
దన్నఁగ ధింధిమి ధ్వనులు దట్టములై ప్రతిశబ్ద మీన నా
సన్న గుహాంతరాళముల సాంధ్యలఁ దాండవమాడు దుఃఖితా
పన్న[1] శరణ్యుఁ డీశ్వరుఁడు భాసమున న్గిరిరించుఁ గావుతన్.

తలపైని జదలేటి యలలు తాండవమాడ
నలల దోపుడులఁ గ్రొన్నెల పూవు గదలాడ
మొనసి ఫాలముపైన ముంగురులు చెఱలాడఁ
గనుబొమ్మలో మధుర గమనములు నడయాడఁ
గనుపాపలో గౌరి కసినవ్వు[2] బింబింపఁ
గనుచూపులను తరుణకౌశికము చుంబింపఁ
గడఁగి మూఁడవకంటఁ గటికనిప్పులు రాలఁ
గడుఁ బేర్చి పెదవిపైఁ గటికనవ్వులు వ్రేల
ధిమిధిమిధ్వని సరిద్గిరిగర్భములు దూఁగ
నమిత సంరంభ హాహాకారములు రేఁగ
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు

---

(1) దుఃఖితులైన యాపన్నులు. (2) ఎలనవ్వు.

కిసలయజటాచ్ఛటలు ముసరుకొని వ్రేలాడ
బుసలుగొని తలచుట్టు భుజగములు బారాడ
మకరకుండలచకాచకలు చెక్కులఁ బూయ
నకలంక కంఠహారాళి నృత్యము సేయ
ముకుజెఱములో శ్వాసములు దందడింపంగఁ
బ్రకటభూతిప్రభాస్రజ మావరింపంగ
నిటలతటమునఁ జెమట నిండి వెల్లువగట్టఁ
గటియుగమ్మున నాట్యకలనంబు జూపట్ట
తకఝణుత ఝణుత యను తాళపుధ్వనము తోడ
వికచనేత్రస్యంది విమలదృష్టుల తోడ
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు

భుగభుగ మటంచు నిప్పులు గ్రుమ్మ చూపులు
ధగధగిత కాంతి తంద్రములుగాఁ గకుభములు
దంతకాంతులు దిశాంతముల బాఱులు వాఱఁ
గాంత వాసుకి హస్త కటకంబు డిగజాఱ
భావోన్నతికిని దాపట మేను వలపుఱాజి
భావావృతంబు వల్పలిమేను గరుపాఱి
గజకృత్తి కడలొత్తి భుజముపై వ్రేలాడ
నజుఁడు గేల్గవమోడ్చి "హరహరా" యని వేడ
ఝణుత తద్ధిఝణుత తదిగిణతో యను మద్దెలల
రణనంబు మేఘు గర్భముల మూసుక పోవ
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

ఎగుభుజమ్ములు సాచి నగుమొగమ్మునఁ జూచి
వగలురమ్మునఁ దాచి భావాభినతి నేచి
తరళతంద్రమ్ము మధ్యమ్ము కిటకిటలాడ
వరసాంధ్యకిమ్మీర[1] ప్రభలు దనువునఁ గూడ
కుణియునెడ[2] నలయుంగపు మణులు చిందఱలాడఁ
కిణుకిణా మటంబునఁ బదకింకిణులు విరుపాఁడ
శృంఖలాపుంజములు చెలఁగి తాండవమాడ
శంఖావదాత లోచనదీప్తి గుమిగూడ
వలగొన్న యెముక పేరులు మర్మరము సేయఁ
బులకింపఁగా నాటెలు మురజంబులును మ్రోయ
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

మొలక మీసపుఁ గట్టు, ముద్దు చందురు బొట్టు
పులితోలు హొంబట్టు, జిలుఁగు వెన్నెల పట్టు
నెన్నడుమునకు చుట్టు క్రొన్నాగు మొలకట్టు
క్రొన్నాగు మొలకట్టు గురియు మంటల రట్టు
సికపై నసల్పకల్పక పుష్పజాతి, క
ల్పక పుష్పజాతిఁ జెగ్గాడు మధువాసనలు
బింబారుణము గదంబిన దాంబూలంబు
దాంబూల వాసనలఁ దగులు భృంగ గణంబుఁ
గనుల పండువు సేయు, మనసు నిండఁగఁ బూయు
ధణధణధ్వని దిశాతతి బిచ్చలింపంగ

(1) అనేక వర్ణములుగల. (2) ఆడు.

ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

సకల భువనంబు లాంగికముగా శంకరుండు
సకల వాఙ్మయము వాచికము గాఁగ [illegible]
సకల నక్షత్రంబులు నలంకారములు[1] గాఁగ
సకలంబు వసియించెడి సాత్త్వికంబును గాఁగ
గణనఁ జతుర్విధాభినయాభిరతిఁ జేర్చి
తన నాట్యగరిమంబునఁ దనరారిన భావమొప్పించి
నృత్యంబు[2] వెలయించి నృత్తంబు[3] రంజింపించి
నృత్త నృత్యములు శబలితముగాఁ జూపించి
లాస్యతాండవ[4] భేద రచనాగతులు మీఱి
వశ్యులై సర్వదిక్పాలకులు దరిఁజేర
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

అంగములు[5] గదలఁ బ్రత్యంగంబులును[6] బెనఁగ
హంగునకు సరిగా నుపాంగంబులును[7] గుదురఁ

---

(1) భూషణము. (2) రసభావాశ్రిత నాట్యము.
(3) చూడు. "నృత్తారంభోట్టహాస"
(4) చూడు. "శివతాండవమట, శివలాస్యంబట"
(5) తల, చేతులు, చంకలు, పార్శ్వములు, నడుము, పాదములు.
(6) మూపులు, భుజములు, వీపు, కడుపు, తొడలు, పిక్కలు.
(7) చూపు, రెప్పలు, నల్లగ్రుడ్డు, చెక్కిళ్లు, ముక్కు, దవుడలు, అధరము, దంతములు, నాలుక, గడ్డము, మొగము, శిరస్సు.

పది సహనాట్యపు పాత్రప్రాణదశకంబులు[1]
నతి శక్తిమూలమగు బాహ్యప్రాణ[2] సప్తకము
ఘనతఁగూర్పఁ జెక్కుచెదరని చక్కదనము గానంబు.
కంఠగాన[3] సమాన కరయుగాభినయమ్ము
కరయుగము కన్నైన కనులలో భావమ్ము
చరణముల తాళమ్ము చతురస్రవృత్తమ్ము
బరువడిగ నిలువంగ నురవడిఁ దలిర్పంగఁ
బరవశత్వమున శ్రీపతియును జెమర్పంగ
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

కర ముద్రికల[4] తోనె కనులఁ జూపులు దిరుగఁ
దిరుగు చూపులతోనె బిగిగట్టె హృదయమ్ము
హృదయమ్ము తనువెంటఁ గదిలికొన భావమ్ము
కుదిరి భావము తోనె కొనసాగ రసమ్ము
శిరము గ్రీవమ్ముఁ జేయురము హస్తయుగమ్ము

(1) పటిమ, నిలుకడ, సమత, చపలత్వము, చురుకు, శ్రమములేమి, బుద్ధి, శ్రద్ధ, మంచిమాటలు, పాట.

(2) మృదంగము, తాళము, వేణువు, పాట, శ్రుతి, వీణ, గజ్జెలు, గాయకుడు.

(3) కంఠము చేత గానమును, దానిలోని యర్థమును హస్తాభినయము చేతను, భావమును కనుల చేతను, లయను పాదముల చేతనుఁ జూపింపవలెనని నాట్యాచార్యసంకేతము.

(4) హస్తముద్రిక యెచ్చట ప్రవర్తించునో దానిమీద దృష్టియు, దాని యందు మనస్సును, మనసునందు భావమును కేంద్రీకరింపవలెనని నాట్యాచార్య సంకేతము. అప్పుడే రసోద్భూతికలుగును.

బోసఁగ ముత్తైపుసటు లొప్పిహాలించు విధాన
నసదృశము నమ్రతాంగుబు నామతించు[1] విధాన
ఘనసారమును దెచ్చి కలయఁ జల్లు విధాన
మనసులో సంతసము గనులఁ జాఱు విధాన
గులుకునీలపుఁగండ్లఁ దళుకుఁ జూపులు బూయ
ఘుంఘుల్లు మని కాళ్లఁ జిలిపి గజ్జెలు మ్రోయ
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

మబ్బుగము లుబ్బికొని ప్రబ్బికొన్న విధాన
నబ్బురపు నీలములు లిబ్బి సేయు విధాన
నల్లగలువలు దిక్కులెల్ల విచ్చువిధాన
మొల్లముగఁ దుమ్మెదలు మొనసికొన్న విధాన
నగలు కాఁటుకగొండ పగిలి చెదరు విధాన
దగిలి చీకటులు గొప్పగఁ గప్పెడు విధాన
దసలోని తామసము గనులఁ జాఱు విధాన
దనలోని వక్రతయె గనులఁ దీఱు విధానఁ
గులుకునీలపుఁగండ్లఁ దళుకుఁజూపులు బూయ
ఘల్లుఘల్లుమని కాళ్లఁ జిలిపిగజ్జెలు మ్రోయ
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

తమ్ములై, ఘటితమోదమ్ములై, సుకృతరూ-
పమ్ములై, శాస్త్రభాగ్యమ్ములై!, నవకోర

(1) పిలుచు.

కమ్ములై, వికచపుష్పమ్ములై, మధురఫల
తమ్ములై, ధ్యానమంత్రమ్ములై, హాసప్రఫు
ల్లమ్ములై, స్తోత్రగానమ్ములై, వజ్రహా
సమ్ములై, గర్జనలనాదమ్ములై, నిర్ఘాతని
దమ్ములై, రక్తకేసలమ్ములై, రక్తచి
హ్నమ్ములై, తాండవగమనమ్ములై గడఁగడాతి
గులుకునీలపుఁగండ్లఁ దళుకుఁజూపులు బూయ
ఘులుఘుల్లు మని కాళ్ళఁ జిలిపిగజ్జెలు మ్రోయ
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

తరఁగలనుఁ జిఱుగాలి పొరలు వేచిన యట్లు
చిరుగాలిలోఁ దమ్మి విరులు గదలిన యట్లు
విరులలో నునుఁదావి తెరలు వేచిన యట్లు
తెరలపైఁ జిత్రాలు పరిఢవించిన యట్లుఁ
గమ్మకస్తురివీణె గడఁగి విరిసిన యట్లు
నెమ్మి దనపింఛమ్ము నెమ్మి విప్పిన యట్లుఁ
జిగురుటాకులు గాలి వగలు వోయిన యట్లు
నగవులో లేవలపు బిగువు జారిన యట్లుఁ
గులుకునీలపుఁగండ్లఁ దళుకుఁజూపులు బూయ
ఘులుఘుల్లు మని కాళ్ళఁ జిలిపిగజ్జెలు మ్రోయ
ఆడెనమ్మా! శివుఁడు.
పాడెనమ్మా! భవుఁడు.

మొగలిపూవులు దావిఁ బుక్కిలించిన యట్లుఁ
దొగకన్నె నీలంపుసొగసు జిమ్మిన యట్లు
నవవసంతపుశోభ భువిఁ గప్పికొన్నట్లు
శివుచెంత శర్వాణిసిగ్గు జారిన యట్లుఁ
గన్నెమదిఁ గోరికల కలలు దూఁకిన యట్లు
సన్నజాజులతీఁగ సంధ్యాస నైనట్లుఁ
బచ్చసంపెంగపూలు బరపులై బడినట్లు
యచ్చెరువు రూపుగొని యాక్రమించిన యట్లు
గులుకునీలపుఁగండ్లఁ దళుకుఁ జూపులు బూయ
ఘలుఘల్లుమని గాళ్ళఁ జిలిపిగజ్జెలు మ్రోయ.

ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

నగవులే నగవులై, బిగువులే బిగువులై
సొగసులే సొగసులై, జూడ్కులే జూడ్కులై
నాలుకారు మొలపుల్లు దోబూచులాడినట్లుఁ
దొలిచూలికన్నె కోర్కులు విచ్చికొన్న యట్లుఁ
దొలుసారి రతి వింతసొలపు గ్రమ్మిన యట్లుఁ
దొలిగట్లపైజొత్తి బులకరించిన యట్లుఁ
దొలుసంజలోఁ జెల్వ దూఁకివచ్చిన యట్లు
మలుసంజలోఁ గాంతి మరలిపోయిన యట్లు
గులుకునీలపుఁగండ్లఁ దళుకుజూపులు బూయ
ఘలుఘల్లుమని కాళ్ళఁ జిలిపిగజ్జెలు మ్రోయ

ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

తీఁగలై, సాఁగలై, దీసుకొని పాయలై
మూఁగికొను జొంపములై, మురిపెంపు సొంపులై
మలకలై, మొలకలై, మెఱపుఁగాని సొగసులైఁ
బాలపంబు వెలిఁగించి పూల తోఁటలుకాయలై
ముడుపులుఁగాని సుడులుఁగాని మొసుమసుఁగాని సొబగులై
జడిమఁగాని దడఁబాటు నడికిఁ గడుఁ దగ్గులై
చలువ గాని కెలఁకులను నలుపుకొని పోఁగులై
పిలపిలమటంచుఁ జావులెసఁగు తావులై
కులుకునీలపుఁగంట్లఁ దళుకుఁజూపులు పూయ
ఘులుఘుల్లుమని కాళ్ళఁ జిలిపిగజ్జెలు మ్రోయ
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

మలక మెఱపులు గొన్ని, నిలుపు మెఱపులు గొన్ని
సొలపు మెఱపులు గొన్ని, సూది మెఱపులు గొన్ని
కోల మెఱపులు గొన్ని, క్రొత్త మెఱపులు గొన్ని
చాలు మెఱపులు గొన్ని, బాలు మెఱపులు గొన్ని
ప్రక్క మెఱపులు గొన్ని, సొక్కు మెఱపులు గొన్ని
నిక్కు మెఱపులు గొన్ని, నిండు మెఱపులు గొన్ని
క్రేళ్లు మెఱపులు గొన్ని, క్రేఁగు మెఱపులు గొన్ని
సుళ్ళ మెఱపులు గొన్ని, త్రుళ్ళు మెఱపులు గొన్ని
కులుకునీలపుఁగంట్లఁ దళుకుఁ జూపులు పూయ
ఘులుఘుల్లుమని కాళ్ళఁ జిలిపిగజ్జెలు మ్రోయ
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు

నెలగాలిపైఁ దేలి పూలయు గీతిక వోలె
నెలపాప బుగ్గపై పాలయు నవ్వును వోలెఁ
[1]కులపాలికా ముగ్ధ [2]కిలకించితము వోలె
జలజాంగనా లలితసంచారములు వోలెఁ
ప్రణయరథమునఁ దూఁగిపడు కింకిణులు వోలెఁ
ప్రణయమూర్తి హృదయమునఁ బారాడు వెలుఁగు వలె
నెలకన్నె మొగఁదలోఁ దలఁపు గలగలల వలెఁ
జలివెలుఁగు వెన్నెలల మొలకతుంపరల వలెఁ
గులుకుసిలఁపుఁగంట్లఁ దళుకుఁజూపులు బూయ
ఘలుఘల్లుమని కాళ్ళఁ జిలిపిగజ్జెలు మ్రోయ
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

చిఱునవ్వు పొరలపై నొఱసి జారెడుఁ గొన్ని
యరుణ గండములపై నంటి యాడును గొన్ని
నెమలిపింఛము వోలె నెఱసి విరియును గొన్ని
కుముదముల ఱేకులై కులుకు వోవును గొన్ని
యిలయు నాకాశమ్ముఁ గొలఁత పెట్టును గొన్ని
తళతళలు వెలయించి తెఱచుఁ గప్పును గొన్ని
యడ్డంబు నిడుపులై యమరి నిల్చును గొన్ని
జడ్డుమాఁకయు లేక యాడిపోవును గొన్ని

---

(1) నవ వివాహిత.

(2) కోపాశ్రుహర్ష భీత్యాదులు సంకరముగాఁ గలుగు శృంగార చేష్ట.

తళుకునీలపుఁగండ్లఁ దళుకుఁజూపులు బూయ
ఘలుఘల్లుమని గాళ్ళఁ జిలిపిగజ్జెలు మ్రోయ
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

సమశీర్షకముతోడ[1] సమదృష్టి[2] ఘటియించి
సమపాద[3] విన్యాస చాతుర్యము లగించి
వరపతాకము[4] దాపటి కేల నెసకొల్పి
వామహస్తం బర్ధో వక్త్రిముగ సంధించి
త్రిపతాక మూని[5] యర్ధ పతాకమును[6] బట్టి
చపల దృష్టులు నేత్రాంచలములను మోపెట్టి
ధూతమస్తము[7] జెల్వొ దోబూచు లాడంగ
వీతరాగులు ఋషులు వినుతులను సేయంగ
నిలయెల్ల చెలువు రూపెత్తి నిల్చిన యట్లుఁ
గలలెల్ల నిజములై గానుపించిన యట్లు
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

---

(1) క్రిందికి గాని, పైకి గాని, వంపక, యెత్తక, సమానముగా నుంచిన శిరస్సు.
(2) తెప్పపాటు లేని దృష్టి.
(3) సాధారణముగా నిలువబడిన ట్లుండుట.
(4) అన్నివ్రేళ్ళను చాచి, బొటనవ్రేలిని, చూపుడు వ్రేలికి దపటి గెణుపున కానించి చూపుట.
(5) పతాకహస్తమున అనామికను వంచిచూపుట.
(6) పతాకమునఁ జిటికెనవ్రేలిని వంచిచూపుట.
(7) ఎడమ కుడిప్రక్కలకుఁ గదలించెడు శిరస్సు.

హంసాస్యమును[1] రెండు హస్తంబులను నించి
యంసభాగంబులకు నానించి చూపించి
కలికిచూపుల చంపకములు పై జల్లించి
కెలఁకులకుఁ గంఠమ్ము మెలఁపుతో నాడించి
కనుగ్రుడ్లు గనులఁ జక్రముబట్టి చుట్టిరా
ధనువులై బొమలు దద్దయుఁ గాంతిఁ జూపరా
నొకకాలు దివిఁగొల్వ నొకకాలు భువినిల్వఁ
బ్రకటముగ దేవతావళులు భక్తినిఁ గొల్వ
నిలయెల్ల చెలువు రూపెత్తి నిల్చిన యట్లుఁ
గలలెల్ల నిజములై గానుపించిన యట్లు
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

ఒకసారి దిరములై యుండి కాంతులు గ్రుమ్మ
నొకసారి గంటవేసికొని ఫూత్కృతిఁ జిమ్మ
నొకసారి మనుబిళ్ళ యోజఁ జెంగుల దాటు
నొకసారి వ్రేలు వాడిన బూలరేకులై
యొకసారి దుసికళ్ళు నోవుఁ జిఱుచేపలై
యొకసారి ధనువులై యుబ్బఁ గన్నులబొమ్మ
లిలయెల్ల చెలువు రూపెత్తి నిల్చిన యట్లుఁ
గలలెల్ల నిజములై గానుపించిన యట్టు
లాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

(1) నడిమివ్రేలు మొదలు మూఁడు వ్రేళ్లను ఎడముగలవిగాఁ జాచి, యంగుష్ఠమును జూపుడు వ్రేలితోఁ జేర్చి కట్టిన హంసాస్యము.

కనుదోయి సైగలకుఁ గనుబొమలె బదు లొసఁగ
మనసులో నూహాలకుఁ దనువె బులకలు దాల్పఁ
బ్రతిపులకలోఁ దీవ్ర భావములు వాసింపఁ
బ్రతియడుగులో లయోన్నతి దూగి శోభింప
నవ్వులకుఁ గింకిణుల నాదములె బ్రతినవ్వ
నవ్వులే మువ్వలై నాట్యమున నెలుఁగివ్వ
నెలుఁగులను శ్రుతియుతులు నెలయు నంఘ్రులగతులు
గలసియో! గలియకో! గడుఁగ్రొత్త రుచి నివ్వ
నిలయెల్లఁ జెలువు రూపెత్తి నిల్చిన యట్లుఁ
గలలెల్ల నిజము గానుపించిన యట్టు
లాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

స్తంభ యుగమో నీప శాఖాద్వయమొ మత్త
కుంభికర కాండములొ గొనబైన దీగెలో
సుమ దామములొ శిరీషములె నిల్చిన విధమొ
గమల రజములు రూపుగట్టి వచ్చిన మెలపొ
దట దుపంచిత కాంతి తాండవంబో యనఁగ
నటువైపు నిటువైపు నమల హస్తములూగి
కనవచ్చుచును మందగతిని గదలినయట్లు
గనరాకయును శీఘ్రగతినిఁ బరుగిడినట్లు
యిలయెల్ల చెలువు రూపెత్తి నిల్చిన యట్లుఁ
గలలెల్ల నిజములై గానుపించిన యట్టు
లాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

పడగ లెత్తును నాగబాహువులై యొకసారి
ముడిచికొనుఁ గమలంపు మొగ్గలై యొకసారి
జ్ఞానముద్రికలఁ బట్టును లెత్తు నొకసారి
దీనదీనంబులై డోలాడు నొకసారి
కటకాముఖంబులై[1] కనుపట్టు నొకసారి
బటు ముష్టి[2] బంధసంపదఁ జూపు నొకసారి
శుకతుండ[3] హస్తమున శోభిల్లు నొకసారి
ప్రకట భ్రమరీసరళి[4] బరిగించు నొకసారి
యటుపైపు నిటుపైపు నమల హస్తములూగి
యటమీఁద నిటఁ గ్రింద నందములు జెలరేఁగి
యాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు

కైలాస శిఖరములు గడఁగి ఫక్కున నవ్వ
నీలిమాకాశంబు నిటలంబుపై నిల్వ
నందికేశ్వర మృదంగధ్వానములు బొదలఁ
దుందిలాటకు నపార తోయపూరము దెరలఁ
జడలెల్లఁ గనువిచ్చి సంభ్రమతఁ దిలకింప
నడుమెల్ల మడిఁబొంగి నాట్యములు వెలయింప

(1) చూపుడు వ్రేలును, అనామికయు, బొటనవ్రేలితో మొగ్గవలెఁ బట్టవలెను.
(2) నాలుగు వ్రేళ్ళను జేర్చి యరచేతిలోనికి వంచి యంగుష్ఠమును మీఁద జేర్చిన ముష్టిహస్తము.
(3) పతాకమున జూపుడు వ్రేలును, అనామికయు వంచిన శుకతుండము
(4) నడిమి వ్రేలితో బొటన వ్రేలిని దాకి చూపుడు వ్రేలిని వంచి తక్కినవి జాచిన భ్రమరము.

వనకన్యకలు సుమాభరణములు ధరియింప
వసుధయెల్లను జీవనంతమై పులకింప
నాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

అదిగదిగో! జలదకన్యక జూచు నేమిటో
సదమలంబై నట్టి శంకరుని నాట్యమ్ము
నవిగో! మయూరమ్ము లాలపించు న దేమి!
శివుని తాండవ కేళి శివకరము షడ్జమము
చికిలిగొంతుకతోడఁ బికము గూయు న దేమి!
సకలేశ్వరుని శ్రుతి స్థాయికై బంచమము
వాయుపూరిత వేణు వర్గ మే మందించు!
నా యభవు దాండవముకై తార షడ్జమం
బాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

ఒకవైపు నర్ధచంద్రకరంబు[1] బంగించి
యొకవైపు సూచీ[2] ముఖోద్వృత్తిఁ జూపించి
క్రీగంటితో నవ్వు గ్రేల్లుచుక వీక్షించి
ప్రాఁగన్ను వైచి తన్మయతఁ దా నటియించి
వామపాదము జక్కఁగా మహిని నాటించి
నేమమున దక్షిణము నింత మీఁదికి నెత్తి

(1) పతాకమున నంగుష్ఠమును క్రిందికడ్డముగాఁ జూచిన అర్ధచంద్రము.
(2) కటకాముఖమునఁ జూపుడు వ్రేలు జూచిన సూచీహస్తము.

యుయ్యాలత్రాఁగుతో నూగులాడఁగ మధ్య
మొయ్యనొయ్యన మువ్వ లూగి నవ్వులు నవ్వ
నాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

కుడికాలి నంబువలెఁ గొంచెముగ మునువంచి
యెడమపాదము వైపు నింతశీర్షము వంచి
కమలనాళములు హస్తములు బారలు సాచి
ప్రమదమ్ముతో రెండువైపు లల్లనఁ జాచి
సవ్యవక్షము బులకచయముతో నుబ్బంగ
సవ్యేతరము సిగ్గుతో వెన్క కొదుగంగ
నొక గపోలము నగవు వికసించి రాగిల్ల
నొక గపోలము బిగువు బ్రకటించి తోపిల్ల
నాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

ఎడమచేతినిఁ బ్రీతి నడుముపై సంధించి
కుడిచేతిలో నంచకొదమగుఱుతు[1] లగించి
యంచముక్కున దృష్టి నంచింతంబుగఁ జేర్చి
సంచాలితమొనర్చి సమశిరము[2] ముందునకుఁ
బరివాహితముఁ[3] జూపి పైపైనిఁ గాంతమ్ముఁ
బరగించి చూపు భావవేశ మధురమ్ము

(1) హంసాస్యము చూ. "హంసాస్యమును రెండు"
(2) చూ|| "సమశీర్షకము"
(3) చక్రాకారముగ గ్రిప్పఁబడు శిరము పరివాహితము

నటుదూగి యిటుదూగి చటులమ్మగ గజకృత్తి
నటనమధ్యమ్ములో నయముగాఁ గడకొత్తి
యాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

ఒకకాలు వెనుకకై యొకకాలు ముందుకై
యొకమెల్లఁ జిరునవ్వు మురిపెముల ముద్దయై
గుడిచేతి యందు లఘుకోణత్వము ఘటించి
యొడికంబుగాఁ దలముఁ బడగవలెఁ గుంచించి
పెరచేత గురుకోణ మరుదుగాఁ దావలచి
కరశాఖలను వంచి శిరము వెన్కకుమలఁచి
వెనుకఁజూచిన యప్డు వెన్నెలలు జిలికించి
మునుముజూచిన యప్డు ముద్దులే బండించి
యాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

హస్తంబు గనుదోయి కష్టంబుగా నిలిపి
శస్తంబ రాళంపు[1] సంజ్ఞ నెదురుగ మలపి
ధూతంబుశిరము[2] సాకూతంబుగను చూపు
ప్రీతిఁగావింప నిల్చిన దేవతల కెల్ల
నాభికెదురుగ దక్షిణంబైన హస్తమ్ము
శోభలనుజల్లింప సోలపద్మపుముద్రో[3]

(1) పతాకమున జూపుడుువ్రేలు వంచిన అరాళహస్తము.

(2) చూ:- "ధూతమస్తముచెల్వ"

(3) అన్నివ్రేళ్లును సందులుగలవిగాఁ ద్రిప్పి పట్టిన సోలపద్మము.

యొకవైపు గతిభాగ మొయ్యారముగ నొత్తి
సకలలోకముల కాశ్చర్యంపు సిడమెత్తి
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

తకిటతక, తకతకిట, తకతకిట, తకిటతక
తకతదిగిణతోఁగిణతోఁ, కిటతకతదిగిణతోఁ
కిటతకతదిగిణతోఁ, కిటతకతదిగిణతోఁ
చటులంబులగు జతులు[1] సరిగాఁగఁ దూఁగించి
ససరిరిస[2] రిగరిరిస సరిగాగ రీగాగ
ధసగాగ గధపాప ధపసాస
రి రి స రి స  స రి గా గ  రీ గా గ రి గ రి రి స
స రి సా స పదపాప సరిగ నెత్తులుముడిచి
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

మేళకర్తలనెత్తి యాలాపనము దీర్చి
యాలాపనమ్ములో నతులను నఱమోడ్చి
సంవాదివాదు లనుస్వరములను జూపించి
గ్రావ్నిసల గుచ్ఛములు గుణిసిపోయిన యట్లు
గమకములు నెలయించి కడఁగి జారులుబట్టి
ప్రమదమ్ముతోడ మూర్ఛనలెల్ల రాఁబట్టి

---

(1) మృదంగపు జతుసల ప్రస్తారము.

(2) మోహనరాగ స్వరములు.

మంద్రమధ్యమతార మధురిమలు జూపించి
సాంద్రమ్ముగా గానసాగరమ్మును రేపి
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

వక్రరాగము నెత్తి, పాండిత్యధీరతో
పక్రమణమును బూని, ప్రక్కవాద్యముఁ జూచి
కనకాంబరియె[1] యంచుఁ గనుఁగొనలనె నవ్వి
వినిపించి, శుద్ధస్వరనిచయంబునె ద్రవ్వి
కాలువిడు[2] పఱియు ముక్కాలుచోటుల నెత్తి
కోలుఁ జూపించి, సిక్కుగఁ బల్లవులఁ బాడి
కాలభేదములతోఁ గలితనం బెలయించి
సోలు నిర్జరమనస్సుల నెల్ల వంచించి
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

మధ్యమము[3] రాగసామ్రాజ్యాధిదైవతము
శుద్ధమ్ముగాఁ[4] బ్రతిగఁ జూపించి వణకించి
వణకులో నొకగ్రొత్త వాలకము గనుబరచి
తని పూవులను బుట్టలను దెచ్చిపోసినటు

(1) కనకాంబరీరాగమున కన్నియు శుద్ధస్వరములే గలవు.
(2) పాటలోని యొత్తుగడ భేదములు.
(3) సామాన్యముగ నన్నిరాగములు మారుటకును, మధ్యమస్వరమే మూలము. అందుచే నది యధిదైవత మైనది.
(4) శుద్ధమ్ముగా శుద్ధమధ్యమము, ప్రతిగ ప్రతిమధ్యమము.

గలగలమనంగఁ జిఱుగవ్వలను వెదికినటు
బలపలని యెండుటాకుల మర్మరములట్లు
నాదధేనువు బొదుగునందు దుగ్ధము జాఱ
భేదవాదము రాగవీథిలో బుడమాఱ
నాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

స్వరకన్యకల గుబ్బచనులఁ బుల్కలు రేపి
సురకాంతలకుఁ గోర్కెలెరయ నెమ్మదులూపి
లయపురుషు[1] నానందరాశిలో మునిగించి
రయముతోఁ దాళముల రవణములు హత్తించి
ఝల్లరీముఖవాద్య చయము మేనులుదాల్చి
యుల్లములఁబొంగెత్తి "యో" యంచు నెలుగివ్వఁ
దంబూర యానంద తరళసంఫుల్లవ
క్త్రింబుతోఁ, దానుగా గళమువిచ్చుకపాడ
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

వల్లకీసుందరులు ఫుల్లరాగములీనఁ
గల్లోలమయిపోవ గంధర్వ హృదయములు
అచ్చరలగన్నులం దానందబాష్పములు
బెచ్చుగా గండముల విరిసికొన హాసములు
గిన్నరీహస్తముల సన్నగాజులు మురిసి
చెన్నుగాఁబలుక నుజ్జీవములు పాటలను

(1) తాళములోని సామ్యము.

బలుకుఁ బల్కున నమృత భరము దుంపెసలాఁడ
నిలువెల్ల గానమే నిండికొని వెలికూర
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

సరిగాఁగ రూపించి షడ్జమము వట్టంగ
శరజన్ము తేజి పింఛమునిప్పి నర్తింప
ఋషభస్వరంబు గుల్కించి పాడిన నంది
వృషభంబు చెలరేగి నియతిపై లంఘింప
నందంబుగా ధైవతాలాపనము సేయ
గంధర్వలోకంపుఁ గనులఁ బూవులు బూయఁ
బనిఁబూనుచు నిషాదస్వరము రక్తికిఁ దేఁగ
వెనకయ్యబృంహితము వెనుకఁ దరుముక రాగ
నాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

ఎత్తుగడ కెత్తుగడ కేరితిఁ దోచునో!
గ్రొత్తతీరులను గ్రొంగ్రొత్తభావము లాచి
సరసిలో వేయలల దెరలవలె నుబుకునో!
స్వరపంపకములోన జాతులను వెస మార్చి
మాన తైక్ష్ణ్యం బదెంతటిదా! దాళము వేయఁ
బూని యమరులు దప్పిపోయినా రెచ్చటనా!
శ్రుతిలయం బెంత పెచ్చుగ రేగెనో! సర
స్వతిగుండె కంపించి జలజలా బారంగ
నాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

అఱుపల్కు వచియించి యత్నులను బూరించుఁ
బూరింపనర్థంబుఁ బొందించు హస్తముల
మొదలఁ గన్నులఁ గొంత ముచ్చటించును, మిగులుఁ
గదియించు వాఙ్మయాఖండ పుణ్యము బండఁ
గనులసైగలు మాటఁ బెనవేసి చూపించు
వెనుక మాటలుబల్కు, మును దీర్చుఁ గన్నులను
వచియించిపల్కు, లావల నేత్రముల దిద్దు
ఖచరులెల్లరును దిగ్భ్రమమొంది వీక్షింప
నాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు

సంయుతకరంబులను[1] శాస్త్రానుసారంబ
సంయుతకరంబులను[2] జక్కఁగాఁ గదియించి
శాస్త్రమునుదాటి తనస్వాతంత్ర్యమును బూని
శాస్త్రకారులయూహ సాగుమార్గముఁ జూపి
భావరాగముల సంబంధంబు, రాగ లీ
లావిశేషంబు నుల్లాసంబు గదియింప
భావమేశివుఁడుగా భ్రమరి చుట్టెడుభంగి
భావలయమెల్ల మదిఁ బొంగి యాడెడుభంగి
నాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

---

(1) రెండు చేతుల హస్తముద్రలు సమన్వితములై, యొక్కయర్థమును జ్ఞాపించిన సంయుతకర మని పేరు.

(2) ఒక చేతిలోనే భావము జూపు ముద్రకు అసంయుతకర మని పేరు.

స్థలపద్మములవోలె నిలుకడగ నిలువఁబడి
మెలఁగుగూర్మమువోలె మెల్లగాఁ జలియించి
యావైపు నీవైపు నల్లనల్లనఁ దిరిగి
భావింప గజగమనభంగి ముందుకు సాగి
వాలుగల కులుకు నలె వంకరలు జిత్రించి
వ్రాలి, నాగమువోలెఁ బార్ష్ణిభాగం బెత్తి
వెనుకభాగం బెత్తి, మునుము నేలకు నొత్తి
యనుకొనని యందమ్ము లలరింపఁ బదతలము
లాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

ఎలగాలిఁ గదలు నాకులవోలెఁ దేలికై
యలలదూగుడులఁ దమ్ములపూవు లట్టులై
గన్నె గనుబొమలోని గలలబరు వట్టులై
మిన్ను గన్నట్టి చిఱుమేఘముల యట్టులై
గలికి బిగికౌగిలింతల హాయిఁ గొల్లాడి
చెలిచెక్కుపై సిగ్గు చెలువంబు నుగ్గాడి
యువనీ కుచస్థలంబట్టుగా బిరుసెక్కి
వివిధరీతుల నేర్పు వెలయింపఁ బదతలము
లాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

కోనలును గొండలును గోల్మసఁగి తలలూపఁ
గొనగోలువలికి సాకూతంబుగాఁ జూచి

డక్కచెక్కను గీటి డంబుగాఁ బలికించి
యెక్కడను దననాట్యమే పాఱుద్రోయంగఁ
దానె తాండవమానో! దాండవమె దానానో!
యేనిర్ణయము దనకె బూనిచేయఁగ రాకఁ
దామఱచి, మఱపించి దన్నుఁజేరినవారిఁ
గామునిని దన మూఁడుగన్నులను సృష్టించి
యాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

ఒకసారి దనుమఱచు నుప్పొంగునాట్యమున
నొకసారి మఱపించు నూది, తాండవకళనె
మఱచిమఱువక యొక్కపరి యాంగికము వట్టు
నెఱసంజవైపుఁ గన్గిఱిపి సైగలుసేయు
నొక్కవైపు దాండవం బొకవైపు లాస్యమ్ము
నొకవైపు గాంభీర్య, మొకవైపు శృంగార
మొకవైపు భస్మంబు, నొకవైపు జిత్రకం
బొకవైపు భేదదృ, క్కొకవై పభేదమున
నాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

నీలసూత్రము[1] లోన నిక్కి యుద్రులుసాచి
కూలంకషమ్ముగాఁ గూయు జిఱుగజియలు

(1) పాదముల యందలి గజ్జెలు నీలసూత్రమునకే గూర్పబడె నని యాచార్యమతము.

జిలిబిలి పదంబులను బలుకు నొక్కొకసారి
కలకలమటంచు నవ్వులు జిల్కు నొకసారి
చెలువంబు వడబోసి చిఱు నవ్వు నొకసారి
గోలఁదిమీఱంగ ఫక్కున నవ్వు నొకసారి
మూఁగసైగలతోనె మురిపించు నొకసారి
రాగాలపనమందు రణియింప నొకసారి
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

జననాంతరంబులో సంసక్తమయి వచ్చి
మనసులోతుల నిల్చి, మాటాడువాసనలో!!
యమృతమయమ్మై యాత్మనంటిన సుషుప్తిలోఁ
గ్రమముగా నవ్వు నిర్ఝరమహాచ్ఛాయలో!!
బ్రమదంబె రూపెత్తు బంగారుకలలలో
నమరకాంతలు సేయునట్టి కనుసైగలో!!
యన సూక్ష్మతమముగా, నటు సూక్ష్మతరముగా
వినఁబడియు, వినఁబడనివిధిగ మువ్వలుమ్రోఁగ
నాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

కరుణఁ జూపినయప్డు దొరఁగుబాష్పమ్ముల
చ్చెఱువు జూపినయప్డు జిగినించు నిశ్చలత
వీరంబులో నగ్గి వెడలించుఁ దారకలు
ఘోరంబులోఁ గెలంకులఁ గొల్చుఁ గనుగ్రుడ్లు

వికృతంబులో నంగి వికటించుఁ గనుబొమలు
వికచంబులగును దారకలు హాస్యమునందు
శృంగారమున విలోలిత దృష్టిపాతంపు
భంగి, రౌద్రమున దుర్భరకటాక్షములతో
నాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

భావాంబరమున కావల వెల్గు దైవంబు
భావగోపీనాథుఁడై వేడ్కఁ జెలఁగించి
రాగిణీవిభ్రమము లక్కడక్కడ దీర్చి
రాగాలపనజన్య రమణీయతలు బేర్చి
యొకయడుగు జననంబు, నొకయడుగు మరణంబు
నొకభాగమున సృష్టి, యొకవైపు బ్రళయంబుఁ
గనుపింపఁ దిగకన్నుఁగొనలు మిన్నుల నంట
మునిజనంబుల హృదయములు దత్పదం బంట
నాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

సమమధ్యద్రుతగతులు జరణముల, ననుకూల
భ్రమణములు నడుములోఁ బ్రౌఢములు వ్యాకృతులు
శయపంకజములందుఁ జక్షుర్యుగంబులోఁ
బయిపైని గప్పికొను భావబంధంబులును
నూరేసిగజ్జియల[1] నులివులో వేదములు

---

(1) ఒక్కొక్క కాలియందును నూరేసిగాని, యిన్నూరేసిగాని, దక్షిణపాదమున నూరు, వామపాదమున నిన్నూరుగాని గజ్జెలు గట్టికొనవలెనని నాట్యాచార్యమతము.

దీప్తైన నృకపాల హారములు గానములు
దోలుకాడు గంగమ్మ యలలలోఁ దానములు
మొలిపించి, జందురుని మొగముపైఁ జిఱునగవు
లాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుడు.

భరతముని ముందుగాఁ బదపద్మములుబట్టి
"హరహరా!"యని ప్రమోదాయత్తుఁడై దూఁగఁ
దనసృష్టిగర్వంబు దలిఁగిపోఁగ విరించి
కనులలో బాష్పములు గట్ట ఢీల్పడి నిలువ
నావైపు నీవైపు నష్టదిక్పాలకులు
కేవలము రసమూర్తులై, విశ్వమును మఱువ
దన వేయికనుఁలు జాలని బిడౌజుఁడు, గౌత
మునిశాపమున గొఱంతనుఁ గూర్చి చింతింప
నాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

హరియె హరుఁడై, లచ్చి యగజాతయై, సరికి
సరి, దాండవములాఁడ సమ్మోదరూపితులు.
హరునిలోహరిఁ జూచి, హరియందు హరుఁజూచి
వెఱవేది దేవతలు విస్మితులు, మునులెల్ల
రథిగతానందభావావేశచేతన్కు
లెదవిచ్చి, యుప్పొంగి, యొగిరి స్తోత్రముసేయ,

భేదవాదములెల్లఁ బ్రదిలిపోవఁగ, సర్వ
మేదినియు నద్వైతమే ప్రతిధ్వనులీన
నాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

శోకమ్ము సంతోష మేకమ్ము, నరకంబు
నాకంబు నేక, మ్మనంత మాకాశమ్ము
బరిగతంబగు భూమి, వననిధులు బల్వములుఁ,
దరులు బీజములుఁ, గ్రొవ్విరులుఁ గసిమొగ్గలును,
జరతాంధకారంబుఁ బరిణాహిచంద్రికలు,
బరమబుషు లజ్ఞాన భరితు, లందఱకు నేఁ.
డద్వైత! మద్వైత! మద్వైత! మని మాటి
కద్వయముగా నొత్తి, యఖిలలోకము లార్వ
నాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

ప్రతితారకయు విచ్చి, ప్రత్యణువుఁ బులకించి
శితికంఠునకు నపుడు సెల్లించినది సేవ,
యానందసాగరం బంతటనుఁ గవిసికొన
మీనములుఁ దిమిఘటలు మేదినీజీవములు
బ్రతిప్రాణిహృదయమ్ము వల్లకీవల్లరిగ
మతిమఱచి పాడినది మధురసంగీతమ్ము.
జగమెల్ల భావంబె, నడియెల్ల రాగంబె
జగతియే యొక నాట్యసంరంభముఁను గాఁగ
నాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

చూచువా రెవ్వరా చోద్యంబు! నందఱును
సూచింత్రు దాండవము, సాక్షి సమ్మోదమున
శంకరుఁడె గెమ్మోవి సెలవులను జిఱునవ్వు
పంకించి తల, నటక వర్గంబు వీక్షించె
హరుఁజూచి హరినవ్వొ, హరుఁడె హరిద్వైనవ్వొ[1]
విరిసికొనె నొకవింత వెన్నెలలు లోకముల
శ్యామసాంధ్యస్ఫూర్తి జంద్రికలలో దాఁగెఁ
గామించెఁ బ్రకృతిఁ జీకటులొ! జ్యోత్స్నతతియొ
ఆడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

నవజటాపటల సంధ్యాకాలవారిదాం
తవికాసిచంద్ర మంద్రాతపార్ద్రశరీర!
నగకన్యకానేత్రయుగళనిర్యత్కటా
క్షగణతాపింఛ పింఛాధీనగురువక్ష!
నిగమదాసీ సమున్నిద్రసాహానినా
ద! గణనీకృతనైకతారహారవిలాస!
భూతేశ! భూతభావాతీత! యనిపల్కి
స్తోత్రములఁ బఠియింపఁ జోద్యమున వైకుంఠుఁ
డాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.

కుడ్మామనోజ్ఞ యావకపుష్పితశరీర!
పద్మామందర నేత్ర! భావాంబరాతీత!

మాయాసతీభవా మధుపరీరంభాఽవి
షయవివేక! హృషీకసంచయాఽధిష్ఠాత!
శౌరి! నీ తేజమే సంక్రమించెను నన్నుఁ
బూరించెఁ దాండవముఁ బూన్చిచిక్కళతోడ!
నని సితాలయమునందు హస్తమ్ములను మొగిచి
వినతుఁడై శంకరుఁడు విష్ణువును నుతియించి
- యాడెనమ్మా! శివుఁడు
పాడెనమ్మా! భవుఁడు.



# విజయా ప్రార్థన

కలకలరణత్కాంచీ, పంచాస్త్ర జీవనమూలికా
నిగడితహరప్రేమా శ్యామా[1] సద్వృత్తవపుస్తనలీ
మునిజనమనఃపేటీ, చేటీకృతామరవల్లభా
జయతి కరుణాపాంగా, చంద్రావతంస సధర్మిణీ !

విరావై ర్మాంజీరైః కిమపి కథయంతీవ మధురం
రహస్యం వేదానాం, లలిత లలితాన్ దృష్టివలయాన్
కిరంతీ శ్యామాంగీ, కుచభర సమనమ్రధ్యలతికా
నటంతీ పేయాన్నః పరమపదసీమా, హరవధూః

మరకతరుచామై దంపర్యం, మునీశ్వరమండలీ
సుచరితఫలం, శాంతం, కటాక్ష తరంగితం
ప్రమదహృదయోపేతం, కదంబవనాశ్రయం
కిమపి సుభగం తేజశ్శివాఖ్య ముపాస్మహే.

నతానాం భక్తానాం నయనయుగబాలార్కసుషమా
మహర్షీణామాశా, త్రిదశతరుణీ కైశ్యఘటితా
స్వసంపర్కోత్సేకా త్స్వపది శివయంతీ శివతనుం
శివంకుర్యాన్మాతుః పదవనజపాటల్యలహరీ !

---

(1) ప్రేంకణపుదిగ.

మదిరాఘూర్ణితనేత్రా
మదగజగమనా, మనోజ్ఞతరవదనా !
మనసి మమ సన్నిధత్తాం
మాతంగీ! మధ్య నిక్వాణాత్కాంచీ!
అనుభవరసికై ర్జ్ఞేయా
మాదిమజననీం ! హృదబ్జమధుధారాం !
నీలమణిసదృశ దేహాం
బాలాం, తా మాశ్రయే మహోరూపాం !



# శివాలాస్యము

ఫక్కుమని నవ్వినది జక్కవల బెక్కువలఁ
జక్కడుచు జనుదోయి నిక్కఁ బార్వతి యపుడు
నిక్కు జనుదోయిలో నిబిడరోమోద్గమము
దిక్కుదిక్కులనెల్ల దివ్యనేత్రోత్సవము !

తెగమిగులు దోగలు జిగి బుగులు గన్నులదోయి
నిగనిగలు మిట్టింప నిలచి చూచెను గౌరి
నిలుచువాలకములో నెలవంపు వంపులోఁ
గులికినది యమృతమో ! గోటిసౌందర్యాలో !

బంధూకపుష్పసంబంధు వగుఁ జిఱుపెదవి
నందముగ గదియించె నలసహాసం బార్య
యానవ్వులోఁ గదిలె నచ్చరలసిగ్గులో !
గాని యీశ్వరు కలలో ! కామధేనువుపాలో !

స్థలపద్మములయొప్పు గల తామ్రతలపాద
ములఁ గదల్చెను దేవి మురిపెములు జిలికించి
కదలుకదలికలోనఁ గలకలా నవ్వెనఁట
గాదమగంటలో ! నిల్చికొన్న స్వరకన్యకలో !

లలితముగఁ బలికినది మొలనూలు, గోయిలల
జిలుఁగుగొంతుక తీపి జలజలా పారించి,
యా వాకలో నిల్చె నాగమాంబురుహమ్ము
లావిరులపై నాడె నానందబ్రహ్మమ్ము !

జంకించినది లులితి చపల భ్రూలతలతో
శంకరునిశర్వాణి. జలద సుందర వేణి
దటుకునను సూచిహస్తంబుతో, నాగేంద్ర
కటకునకు ధైర్యంబు గంపించిపోయినది!

అటుబండె నొకసారి యతివ కిలికించితం
బిటువిరిసె నొకసారి యింతి యుల్లోకితము[1]
ప్రమదాకపోలమ్ము భావకిమ్మీరితము
కమనీయ మదరాగ కలికా విచుంబితము

ఝణుఝణు క్వణనంబు లనుగతిగముగఁ బాడ
నణుమధ్య జూపినది యభినయ విభేదములు
వనములను, వనధికంకణములను, జగతిలో
నణువణువునను భావ మాక్రమించిన దపుడు

తరళలోచన వింత తానకంబుల నిలచి
కరపద్మముల నర్థకలనంబుఁ జూపించె
నా సృష్టి నందుకొన కమరులును దేవర్షు
లాశంకితులు, నద్భుతా క్రాంతమానసులు—

గా నించినది దేవి, కలకంఠశ్రుతివీధి
లో, నిత్యరమణీయలోకములు బొంగెత్తఁ
బలికినవి వల్లకులు కలకంఠిగానమ్ముఁ
బలికినవి వల్లకులా! బరమేశ్వరియొగాని!

---

(1) నీూదికి నిక్కించఁ బడిన దృష్టి యుల్లోకితము.

తకఝణుత ఝణుతతక, తకిటతది గిణతొతది
గిణతొ, తదిగిణతొ యను రణనములు మీఱంగఁ
బ్రతిగ జ్జెయడఁదలో భావములు బులకింపఁ
బ్రతిభావమున రసము వాఱిదిక్కుల ముంప,

ప్రియురాలి యూరుపులు బ్రేరేప చషకమ్ము[1]
పయి మందవలితమ్ములయి లేచు దరగలటు
బాలేందుఫాల, నగబాల, పార్వతి నిలిచి
లీలావిపర్యాప్త రేచితభ్రూలతలు[2]

పరివాహితము శిరము[3], చిఱునవ్వు, నెత్తమ్మి
విరి కన్నుఁగవలందు విభ్రమాలోకితము[4],
కించిదాకుంచితము, చంచలము, బొమదోయి
పంచాస్త్రుని బాణమ్ము, పర్వతేశ్వరు సుతకు

---

(1) ఆమె రేచిత భ్రూలతలు చాల లలితముగ నగుపడినవి. అవి యెట్లున్నవనగా, ప్రియురాలు ప్రియునకు మద్య మందించునపుడు ఆమె యూరుపులచేత నామద్యపాత్రమున లేచు మద్యతరంగము లంత లలితముగ నున్నవి.

(2) అందముగ మీఁది కెత్తఁ బడినవి.

(3) వింజామరము వలె ఇరుప్రక్కలకు వంచు శిరస్సు పరివాహితము.

(4) తిరుగుడు గల చూపు ఆలోకితము.

నవశిరోభేదములు[1] నవకంబుగాఁ జూపి
భవురాణి యష్టగుణభావదృష్టులు[2] మోపి
పదిరెండుహస్తములు[3] బట్టి, మదిరాక్షి మఱిఁ
బదిలంబుగాఁగ గ్రీవాభేదములతోడ

ఆడినది గిరికన్నె యలసమారుత మట్లు
బాడినది సెలకన్నె పకపకా నవ్వినటు
లాటపాటల తోడ నవశుభ్రై బ్రహ్మర్షి
కోటు లెల్లెడ నమిత జూటులై సేవింప

శరదభ్రఘూళిపింజరితముల చక్రముల
సరిదూగు లావణ్యాభరిత కుచయుగ్మములు
చనుకట్టు నెగమీటి మినుఁ దాకునో! యనగ
వనజాక్షి, బైపైని వక్షమ్ము విరియించి
యాడినది గిరికన్నె!

ఒకవైపు భ్రూభంగ మొదిగించి చూచినది
వికచసాకూతముగ విశ్వేశ్వరుని లలిత

(1) సమము, ఉద్వాహితము, అధోముఖము, ఆలోలితము, ధుత కంపితములు, పరావృత్తోత్క్షిప్తములు, పరివాహితము.

(2) సమము, ఆలోకితము, సాచి, ప్రలోకితము, నిమీలితము, ఉల్లోకితము, అనువృత్తము, అవలోకితము.

(3, ఇచట హస్తశబ్దము హస్తప్రాణముల: కౌహచారిత్వము హస్తప్రాణములు పదిరెండు. ప్రసారణ, కుంచిత, రేచిత, పుంఖిత, అపవేష్టితక, ప్రేరిత, ద్వేష్టిత, వ్యావృత్త, పరివృత్త, సంకేత, చిహ్న, పదార్థటీకలు.

యా చూచుచూపుతో నర్ధేందుభూషునకుఁ
బూచిపోవఁగ బుష్పముకుళములు నిలువెల్ల
నాడినది గిరికన్నె !

మేఖలాచంద్రకిత మృదుమధురమా మధ్య
మాకంపితంబయ్యె నగరాజప్రియపుత్రి
కా కంపితంబులో నలసవ్రీడాభరం
బా కేకరితదృష్టి[1] యనురాగసూచకం
బాడినది గిరికన్నె !

సవ్యహస్తం బర్ధచంద్రాఽభినయముతో
దివ్యలీలనునిలిపి, దేవి నడుమునయందుఁ
గోనగోట నుదుటఁగ్రమ్మిన చెమ్మటల మీట
కోనచూపులనె శివుని గోర్కెలోతులు దాటె
యాడినది గిరికన్నె !

కోపఘూర్ణితమైన కోడమనాగము వోలెఁ
దీపులగుమూపులు దెసలెల్లజల్లించి
యలసవలితములు జేతుల భంగిమలతోడ
జలజారిముకుటు గన్నుల నాస లెసకొల్పి
యాడినది గిరికన్నె !

నడునొసలిపై నున్న నాభినామము కరఁగి
నడిజారి కనుబొమల వంకలను నిలువంగఁ

(1) కనుబొమ్మలు పైకెత్తినదృష్టి.

గ్రొత్తఁదోఁచిన దంతకోరకంబుల గాంతి
గుత్తులుగ గుత్తులుగ హత్తికొన శివుపైని
యాడినది గిరికన్నె !

సమపాదయుతస్థాన స్థానకస్థితి నిలచి
క్రమముగాఁ జూపులను గంజాక్షి విరజిమ్మ
ఘులుఘుల్లుఘులు మనెడి వలయునాదములతోఁ
జిలిపిసవ్వుల సుమాంజలి వట్టి శివునకై
యాడినది గిరికన్నె !

వెలయంగఁ దొమ్మిదగు విధములను జెలువముగ
నలినాక్షి భూచారినాట్యములు[1] జూపించి
పదునాఱగు ఖచారిపద్ధతుల[2] నెసగించి
మదిరాక్షి గతిచారి మధురిమలు బొసఁగించి
యాడినది గిరికన్నె !

శిరముఁ జూపులు మించుఁ జెక్కుళ్ళుఁ గనుబొమలు
దరుణాధరము బయోధరములును దంతములు
ముఖరాగచిబుకములు మొదలైన వావగలు
సకియ, భావానుగుణ చాలనంబుల నెసఁగ
నాడినది గిరికన్నె !

---

(1) నేలపై నిలిచి చేయు నాట్యము.

(2) పైకి చెంగించుచుఁ జేయు నాట్యము.

శుకతుండనిభ కుచాంశుకము వదులుగ జాఱ
మొకముపై ముంగురులు ముసరుకొని విడఁబాఱఁ
బంచవన్నెలకాసె వగలుగులుకఁగ, విమల
చంచలాక్షులఁ గటాక్షాంచలమ్ములు మిగుల
నాడినది గిరికన్నె!

సమరూపములగు నంసములుఁ గటి కంఠములు
సమపాదములు నంగసమరూపచలనములు
నురము పెక్కువయు, సుందర భావప్రకటనము
సరసీజముఖి నాట్యసౌష్ఠవమ్మునుఁ జాట
నాడినది గిరికన్నె!

ఆవైపు నీవైపు నతిరయంబునఁ దూఁగ
భావభవు తరవారినా వెలయు గీలుజెడ
చలితనాట్యమున నాశ్చర్యపరవశుఁడగుచు
లలితేందుధరుడు చానిలువఁ దిన్నఁగనగుచు
నాడినది గిరికన్నె!

పూవుగుత్తులనడుమఁ బొలుచు గిసలయమువలె
డా విమలమర్దళాంతరమునను నిలుచుండి
పలుమారు నిలమీఁద లలితముగఁ గ్రుంగి, కిల
కిలకేల మటంచు, మేఖల నవ్వులనుఁ బొదల
నాడినది గిరికన్నె!

జరతపావిడ చెఱఁగు చలియింప, గంటసరి
గరము నటియింప, బంధురశ్రోణి గంపింప.

గరయుగంబుల ఘల్లుఘలుమంచు నెలుగించు
వరకంకణములతో భావభవు గంధగజ
మాడినది గిరికన్నె!

కలఁగఁ జెక్కుల్పైఁ గస్తూరి మకరికలు
మలఁగ నిటలంబుపైఁ దిలకంబు లలితంబు
నిడుదఁ గన్నులఁ దేరు నీలోత్పలములతోఁ
దడఁబడని లయతోడఁ గడువేగముగ నప్పు
డాడినది గిరికన్నె!

ధిమిధిమి యటంచు దుర్దిన వారిధరధీర
భ్రమబూన్చి మద్దెలలు బలుమారు ధ్వనియింప
జకితచకితాంగియగు సౌదామనియు వోలె
వికచాక్షి యజ్ఞాత విభ్రమంబులు జూపి,
యాడినది గిరికన్నె!

భవుని వక్షమునందుఁ బదలాక్షఁ జిత్రించి
నవరసంబులకుఁ బుణ్యపుఁ బంట జూపించి
భరతముని నానంద తరళితునిఁ గావించి
స్వరకన్యకలకుఁ దత్తైజపాటుఁ గల్పించి
యాడినది గిరికన్నె!

కుచ్చెళులు భువిఁ గుప్పగూరిరైయై నటియింప
ముచ్చటలతో మొగము మురిపెముల వెలయింప

ముచ్చటగ నిరుప్రక్క ముక్కరయుఁ గంపింపఁ
బచ్చవిల్తునిపూన్కిఁ బారంబు జూపింప
నాడినది గిరికన్య!

ప్రతిపదములో శివుఁడు బరవశతఁ దూఁగంగ
సతి జంద్రముకుటంబు సారెకుఁ జలింపంగ
ప్రతతి దూఁగాడినటు వాతధూతంబౌచు
శతపత్రమది ముక్తసరి విచ్చికొన్నట్టు
లాడినది గిరికన్య!

గగనవనమునఁ విచ్చికొనిన జలదంబట్లు
వనమునను బారాడు వాతపోతంబట్లు
పోతమ్ము గల్లోలములపైనిఁ దూఁగినటు
శాతాక్షి గాయమ్ము సంచాలితమొనర్చి
యాడినది గిరికన్య!

బ్రహ్మాణి మానంద పారిప్లవాంగియై
జిహ్మాగాక్షముల వీక్షించి మిన్నాకంగ
సకలామరులు శిరస్స్థలకీలితాంజలులు
సకలేశ్వరినిఁ దన్ను సంస్తుతించుచునుండ
నాడినది గిరికన్య!

ప్రతిసుమముఁ దన్మయత్వమునఁ గిలకిల నవ్వఁ
బ్రతిపక్షి యున్మాద పరవశత నదియింపఁ

ప్రతిజీవి పులకింపఁ బదునాల్గు లోకముల
నతులితంబైనట్టి యద్వైతమే ప్రమోగ
నాడినది గిరికన్య !

తనలాస్యమును మెచ్చి తరుణచంద్రాభరణుఁ
డనుమోదమునఁ జేతులను గలిపి చూడంగ
శివశక్తు లొక్కటిగఁ జేరినంతన ఘనాను
లవికృతేంద్రియ "లో !" మ్మ్రాటంచుఁ జాటింపంగ
నాడినదు గిరికన్య !

పలికిరంతటన గీర్వాణు లెల్లరుఁ గూడఁ
జలితకంఠముల శివశక్తులకు మంగళము !
కచ్ఛపీవీణ యుత్కంఠతోఁడుత గాంగ
గుచ్ఛముల నీన నాఘూర్ణితములుగ దిక్కు
లాడిసది గిరికన్య !

దేవాదిదేవాయ ! దివ్యావతాగాయ !
నిర్వాణరూపాయ ! నిత్యాయ ! గిరిశాయ !
గౌర్త్యైనమో ! నిత్యసౌభాగ్యదాయై !
తురీయార్థదాత్ర్యై !! ధరాకన్యకాయై !!!



వెల్కమ్ ప్రెస్ : గుంటూరు—2.